### బొంబాయి అల్లరులు నేడు శాంతించుట

నేడు 200 మందిని అరెస్టు చేయుట

బొంబాయి, మే 11:—

బొంబాయిలో తుంటరుల నందరినిపోలీసువారు అరెస్టు చేయుచున్నారు. నేడు మధ్యాహ్నము 12 గంటలవరకు సుమారు 200 మందిని అరెస్టుచేసిరి. నేడు ఒకడు చనిపోయెను ఒకనికి గాయములు తగిలినవి. నేడు చాలవరకు శాంతముగా నున్నది. చాల దుకాణములు తెరువబడెను వీధులలో మనుష్యులు కొంత స్వేచ్ఛగా తిరుగుచున్నారు. కర్ఫ్యూఆర్డరు సవరింపబడెను. మరి 5 రోజులవరకు రాత్రి 10 గంటల తరువాతను ఉదయము 6 గంటలవరకును యెవరును వెలుపలకు రాగూడదు. అను సవరణ చేయబడెను.

### ఢిల్లీ కాంగ్రెసు అధ్యక్షులగు సేటు రణఛోడలాలుగారికి శిక్ష వేయుట

ఆయన మోటారు జప్తుచేయుట

అహమ్మదాబాదు మే 2:—

ఢిల్లీలో జరిగిన 47 వ జాతీయ మహాసభకు అధ్యక్షత వహించిన సేటు రణఛోడలాలుగారి కేసు విచారణ నేడు అడిషనలు మేజస్ట్రేటు కోర్టులో జరిగినది

సేటుగారిని 11-2-32 వ తేదీని అరెస్టుచేసిన తరువాత వదలిరి. గాని ప్రతిదినమును రెండుసారులు పోలీసువారికి కనబడు చుండవలెనని జిల్లా మేజస్ట్రేటు నోటీసు నిచ్చెను. సత్యాగ్రహమునందు పాలుగొనననని సేటుగారు పూచీకత్తు నిచ్చుటచే అమరతును మేజస్ట్రేటు రద్దుపరచెను. ఆ పూచీకత్తుకు విరుద్ధముగా సేటుగారు ఢిల్లీపోయి కాంగ్రెసు అధ్యక్షత వహించెను. అని ఫిర్యాదుల పక్షమున వాదించిరి. నేనట్టి పూచీకత్తును ఇచ్చియుండలేదు. అట్టి లిఖిత మేమైన యున్నచో కోర్టులో దాఖలు చేయవలెను. అని సేటుగారు స్టేటుమెంటులో తెలిపిరి. గాని వాదించలేదు. ఆజిల్లా మేజస్ట్రేటు యిప్పుడు అహమ్మదాబాదులో లేడు. అతనిని కోర్టువారు పిలిపించవలసియుండును. అని ఫిర్యాదీల న్యాయవాది తెలిపెను.

సేటుగారికి 9 నెలలు కఠిన శిక్షయు 5000 జుర్మానాయును వేయబడెను. అందులకుగాను నేడు సాయంకాలము పోలీసువారు సేటుగారి మోటారుకారును జప్తుచేసిరి.

### శ్రీమతి వినోదినీ నీలకంఠ కన్యగారిని మరి ఇద్దరు స్త్రీలను అరెస్టుచేయుట

గుజరాతు కాంగ్రెసు 18వ డిక్టేటరు శ్రీమతి వినోదినీ నీలకంఠ కన్యగారును మరియిద్దరు స్త్రీలను నేడు సాయంకాలము దక్ష్మదినము సందర్భమున బహిరంగసభను జరుపబోవగా పోలీసువారు మరి ముగ్గురు యువకులను అరెస్టుచేసిరి.

### అలహాబాదులో పతాకము నెత్తుకొనిపోవుట

పోలీసువారు చెదరగొట్టుట

అలహాబాదు, మే 12:—

అలహాబాదు పోలీసుస్టేషనువద్ద జాతీయ పతాకము నెత్తుటకు కొందరు ప్రయత్నించగా పోలీసువారు వెంటనే వచ్చి తరుమగొట్టిరి. లాకొర్రులచ్చిని పతాకముల నెత్తుకుండ పోలీసువారు కావలికాయుచున్నారు. నిన్నను అరెస్టు చేయబడిన బాలురను నేడు వదలివేసిరి

---

# ఆంధ్రదేశము

---

గుంటూరు నగరము

స్వదేశీవస్తు ప్రదర్శనశాల బహిర్గతపరచుట

గుంటూరు, మే ౨౨:—

నేడు సాయంత్రం గుంటూరు టవున్‌హైస్కూలులో ౬ గంటలకు శ్రీయుత స్వామి వెంకటాచలంశెట్టిగారిచే అఖిలభారత స్వదేశీవస్తు ప్రదర్శనశాల బహిర్గతపరుపబడెను. ప్రదర్శనశాల చాలఅందముగా అలంకరించబడెను. జనరల్ ఎలక్ట్రిక్ స్టోర్సువారిచే విద్యుద్దీపములు చాల అందముగ అలంకరింపబడెను. పలుతావులనుండి చాలాస్వదేశీ వస్తువులకొట్లు వచ్చియుండెను. ప్రదర్శన శాల చూచుటకు చాలాచోట్లనుండి ప్రముఖులు చాలామంది వచ్చిరి. ప్రారంభోత్సవ సమయమందు గుంటూరు వర్తక సంఘమువారు శ్రీయుత స్వామి వేంకటాచలం శ్రేష్టిగారికి సన్మానపత్రము సమర్పించిరి. స్వదేశీ ప్రోత్సాహ సంఘముతరఫున శ్రీయుత ఏకా ఆంజనేయులు గారు పూలదండను శ్రీ స్వామి వేంకటాచలం శ్రేష్టి గారికి సమర్పించిరి.

సాయంత్రము ౫. ౩౦ గంటలకు గుంటూరు పురపాలక సంఘమువారు పురపాలక సంఘభవనములో స్వామి వేంకటాచలం శ్రేష్టిగారికి సన్మానపత్రము సమర్పించిరి.

విందు

రాత్రి ౮. ౩౦ గంటలకు స్వదేశీ ప్రోత్సాహ సంఘమువారు పట్టణ ప్రముఖులకు హైస్కూలు భవనములో విందొసగిరి.

నెల్లూరిశిక్ష

నెల్లూరు, మే ౨౦.—

ఉపాధ్యాయ రాధాకృష్ణయ్యగారు ౬ వ తేదిన కరపత్రములు పంచినందుకు అరెస్టుచేయబడి నేడు ౬ నెలలు కఠినశిక్ష సి. తరగతి ఒసంగబడిరి.

అస్పృశ్యతా నివారణోద్యమము

---

నర్సాపురం తాలూకాలోనిప్రచారం

పశ్చిమగోదావరి జిల్లా దివ్యజ్ఞాన సేవాసమితి కార్యదర్శిగానైన శ్రీయుత తాడిమేటి కుటుంబ శాస్త్రి ( నిడదవోలు ) గారిచే నర్సాపురంలో యేర్పాటుగాబడిన శాఖవారు అస్పృశ్యతా నివారణమునకు పూనికొని యీతాలూకాలో నెలరోజులనుంచి ప్రచారము చేయుచున్నారు.

శ్రీయుతులు తాడిమేటి కుటుంబశాస్త్రి, చామర్తి సత్యనారాయణ బి. ఎ. బి. ఇ. డి. గార్లు యీకార్యక్రమమును కడుదీక్షతో కొనసాగించుచున్నారు. వీరికన్నివిధములచే దోడువాడుగ నర్సాపురం హైస్కూలు కొందరును, ఆదిమాంధ్ర యువకులగు శ్రీయుతులు గొట్టుముక్కల వెంకన్న' జొన్నల లాజరను. పోలుకొండ భద్రయ్య, బుడితి వెంకటరెడ్డి, వీరుళ్ల వెంకన్న గార్లు తగినరీతిని సహాయము చేయుచున్నారు. వీరురాత్రులయందు గ్రామములకు పోయి ఆదిమాంధ్రులను, ఇతరవర్ణస్థులను అందరిని యొకచోట సమావేశపరచి వారికిప్రస్తుతపు ప్రపంచ పరిస్థితులను విపులముగ విశదీకరించుచు దుస్థితిని వివరించి వానినివరించు నుత్తమమార్గములను బోధించు చున్నారు.

వీరియుపన్యాసములు ప్రజలలో అద్భుతమైన ప్రబోధమును కలిగించుచున్నవి. కొన్నిగ్రామములవారు ముందుగనేవచ్చి తమ గ్రామమునకు ఈసమితివారిని ఆహ్వానించుటకు బట్టి దీనివిలువ గ్రహించనగును.

ఈయుద్యమము సానుభూతి గలవారు యీసమితికి సభ్యులుగ జేరి దీనికన్నివిధముల సహాయముచేయ ప్రార్థించుచున్నాము.

ఈసమితివారు యింతవరకు ప్రచారముజేసిన గ్రామముల వివరము.

| తేదీ | గ్రామం |
|---|---|
| ౨౮-౪-౩౭ | మల్లవరం |
| ౯-౫-౩౭ | సరిపల్లి |
| ౧౦-౫-౪౭ | లిఖితపూడి |
| ౧౧-౫-౩౭ | గొల్లప్రోలు |
| ౧౨-౫-౩౭ | మల్లవరంలంక |
| ౧౩-౫-౩౭ | మర్స్యపురి |

ఈశ్వరుడు యీసమితిని సభ్యులను ఆశీర్వదించుగాక.

ఆదిమాంధ్ర శ్రేయోభిలాషి,
జొన్నల- లాజరసు,
మల్లవరంలంక, ౧౫-౫-౩౭

ఏలూరుస్త్రీ ప్రభాతభేరీలకు శిక్ష

---

౬ మాసములు కఠినశిక్ష
రూ. ౧౦౦ జరిమానా

ఏలూరు, మే ౨౩:—

శ్రీయుతులుచుండూరిరత్తమ్మ, జవ్వాజి రాజరత్నమ్మ, మద్దులదమయంతి, కంది నాగరత్నమ్మ గార్లను క్రిమినలు లా సవరణ చట్టము ౧౭ (౧) సెక్షను క్రింద ఆరుమాసములు కఠిన ఖైదు రూ. ౨౦౦ జరిమానా చెల్లించనిచో మరియొక టిన్నరమాసముల కఠినశిక్షయు విధించుచు సబు మేజిస్ట్రేటు డి. సూర్యనారాయణమూర్తి గారు నేటి సాయంకాలము 4-30 గంటలకు తీర్పుచెప్పిరి. స్త్రీలు అందరును మిక్కిలి సంతోషముతోను ఉత్సాహము తోడను తీర్పును వినుచున్నారు. తదుపరి వారు ఆడమనిషిని ఒకతెను వారు నెల్లూరు జైలునకు పంపునప్పుడు సహాయమిమ్మని కోరగా మేజిస్ట్రేటుగారు శిక్షితులు నలుగురును స్త్రీలే గావున మరియొక ఆడమనిషిని తోడుయిచ్చుటకు రూల్సుప్రకారము వీలులేదని చెప్పిరి. తరువాత శిక్షితులు వారిబంధు మిత్రాదులతో ముచ్చటించి సెలవుగైకొనిరి. చుండూరి రత్తమ్మ గారి పక్షమున ఆమెపుత్రుడు లక్ష్మీ నారాయణ గారు వెంటనే మేజిస్ట్రేటు గారియెదుట రెండువందల రూప్యముల జరిమానా చెల్లించిరి. ఆస్తివివరముల స్టేటుమెంటును పెట్టినచిమ్మట దానినిసవరించి తరగతిని సిఫార్సు చేసెదనని మేజిస్ట్రేటు గారు నుడివిరి. రేపుశిక్షింపబడిన స్త్రీలను వెల్లూరుజైలునకు పంపెదరని తెలియుచున్నది.

గుంటూరు నగరము

---

స్వదేశీవస్తు ప్రోత్సాహ సంఘమువారి బహిరంగసభ

గుంటూరు, మే ౨౩—

ది ౨౨-౫-౩౭ వ తేదీ సాయంత్రము గుంటూరు టవున్ హైస్కూల్ భవనము ఆవరణలో శ్రీయుత డాక్టర్ వెంకట్రావు పంతులుగారి అధ్యక్షతను స్వదేశీవస్తు ప్రోత్సాహమును గూర్చి గొప్ప బహిరంగ సభజరిగినది. పట్టణ ప్రముఖులును ఇతరపట్టణములనుండి వచ్చినవారును వెయ్యిమంది సభనలంకరించిరి. సభాప్రారంభమున స్వదేశీవస్తు ప్రోత్సాహ సభ్యులుశ్రీయుత ఏకా ఆంజనేయులు పంతులుగారు మద్రాసు శాసన సభ్యులు శ్రీయుత స్వామి వెంకటాచలం శ్రేష్ఠిగారిని ప్రజలకెరుక పరచుచు వారి కార్యదీక్షతను గూర్చి కొనియాడుచు వారిమెడయందు పూలమాలికను వేసిరి. అధ్యక్షులవారి మెడయందు పూలమాలికను వేసిరి. స్వామి వెంకటాచలం శ్రేష్ఠిగారు ఉపన్యసించుచు పత్రసంగతులంశములను చెప్పిరి. ఏదేశమైనను ఆదేశము లోని ప్రజలు జీవయాత్ర సక్రమముగా గడుపవలెననే ఉద్దేశ్యము యున్నయెడల వారిదేశములోని వస్తువులను ఎక్కువగా కొనుచు యితర దేశములనుకూడా పంపవలెననియు హిందూదేశములోకూడ యిదివరలో ఈవిషయమై ఎక్కువగా కృషిచేసి వారుతయారుజేసిన వస్తువులలో వారికికావలసినవి ఉంచుకొని మిగతవి యితర దేశములకు విరివిగా పంపి మిక్కిలి కీర్తినిపొందిరి. ఇటుస్థితి యితరదేశములు సహింపక వారివారి దేశములలో వారికికావలసిన యంత్రములను స్థాపించుకొనివారికి కావలసిన సామానులను తయారుజేసికొనుచుండిరి. ఇండియాలో యంత్రాలయములు స్థాపించి కావలసిన వస్తువులను తయారుజేసికొనుటకు అవకాశము లేకుండాయున్నది. నేడు ఈ గుంటూరులో స్వదేశీప్రోత్సాహ సంఘమువారొనర్చిన యేర్పాట్లు మిక్కిలి కొనియాడదగియున్నవి. అందరు ఇందువిషయమై ఎక్కువశ్రద్ధ తీసికొన వలసినదనియు చెప్పిరి. వర్షమువచ్చుటచే అధ్యక్షునికివందనములతో వెంటనే సభచాలించిరి.

నేటి ఈ ఉత్సవములు సభలు జయప్రదముగా జరిగినందులకు ప్రజలలో చాలా ఉత్సాహముగానున్నది. స్వదేశీవస్తు ప్రదర్శన శాలలోజనులు చాలామంది వస్తువులను గుడ్డలను విరివిగా కొనుచున్నారు.

తెనాలి

---

అరెస్టులు

తెనాలి, మే ౨౮

నేడు కాంగ్రెసు దినసందర్భమున అల్లూరి సీతారామరాజు గారి ( పితూరిదారుడు ) సోదరుడగు శ్రీయుత అల్లూరి శ్రీరామరాజు గారి ఆధిపత్యమున శ్రీయుత మండవ రాజశేఖరం కొల్లచలం వెంకటవరప్రసాద రావుగార్లు గాంధీచౌకునందు విదేశవస్త్రములు దహనమునర్చి యటనుండి పికెటింగునకు బయలుదేరిరి కోట వెంకటయ్య గారి షాపునెదుట నిలుచబడి పికెటింగు జేయుచుండగనే పోలీసువారు వచ్చివారిని అరెస్టుజేసి సబ్ జైలుకు తీసికొనిపోయిరి.

తరువాత కొలది సేపటికి మరియొకజట్టు కల్పాల సాంబయ్య, ఉబ్బిచెర్ల మాణిక్యాల రావుగుప్త (భీమవరం తాలూకా గార్లు బయలుదేరికాంగ్రెసు తీర్మానకరపత్రికలను పంచిపెట్టుచు గాంధీభావిసద్దకు రాగానే పోలీసు వారే అరెస్టుజేయబడి సబ్ జైలుకు గొనిపోయిరి.

## సరిహద్దురాష్ట్ర శాసన సభ

ప్రభుత్వమువారికి అపజయము

ఎక్సైస్ గ్రాంటు నిరాకరింపబడుట

అబోట్టాబాదు, మే 23:—

నేడు ఉదయము పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్ర శాసనసభలో గ్రాంట్లపై వోట్లు గైకొనబడెను. భూమి సిస్తుకుగాను ఒక్క గ్రాంటు మాత్రము (రూ. 2,07,000 గ్రాంటు) యింతవరకు మంజూరు చేయబడినది. ఈ గ్రాంటు మంజూరు చేయబడినను చాలమంది సభ్యులు భూమి సిస్తును వసూలుచేయు విధమును తీవ్రముగా ఖండించిరి. ఈ శాఖోద్యోగియులు లంచములను గైకొనుచున్నారని వా రనిరి.

ఈ గ్రాంటును చర్చించు సమయమున సభ్యులు చెప్పిన విషయముల నన్నిటిని జాగ్రత్తగా విచారించెదరని ప్రభుత్వమువారి పక్షమున ఆర్థిక సభ్యుడు చెప్పెను.

ప్రభుత్వ పరాజయము

ఎక్సైస్ రిజిస్ట్రేషను శాఖలకు ప్రభుత్వము వారు 86,000 రూపాయలను కోరగా సభవారు నిరాకరించిరి. కల్లు సారాయీలకు, నిషావస్తువులను అమ్మ మంత్రిలజీతముల నిచ్చుచుండుట చాల అప్రశస్తమని మహమ్మదీయ సభ్యులు, జాతీయవాదులు, హిందువులు, అభివృద్ధికోరువారు అందరుచెప్పి గ్రాంటును ప్రతిఘటించిరి. గ్రాంటును నిరాకరింపవలెనని ఉర్దూభాషలో పలువురు సభ్యులుగావించిన ఉపన్యాసములు సభవారికి నచ్చెను. మంత్రులపక్షము నారుగూడ ఈగ్రాంటు విషయమై ప్రభుత్వప్రతిపక్షులతో చేతులుగలిపిరి. సభ రేపటివరకు ఆపుచేయబడెను. రేపు అటవీ శాఖా గ్రాంటు చర్చింపబడును.

అబోట్టాబాదు, మే 23:—

నేడు సరిహద్దురాష్ట్రీయశాసనసభలో ప్రశ్నోత్తరములయనంతరము గ్రాంట్లపై చర్చ జరిగెను. ప్రభుత్వసభ్యులు సమ్మజెప్పిన తరువాత భూమిసిస్తు గ్రాంటును తగ్గించవలెనను ప్రతిపాదనము ఉపసంహరించుకొనబడెను.

ఎక్సైజ్ గ్రాంటు నిరాకరింపబడుట

ఎక్సైస్ శాఖకు గ్రాంటు 86 వేల రూపాయిలుగా నిర్ణయింపబడెను.

ఇండిపెండెంటు పార్టీ నాయకుడగు మాలిక్ ఖుదాబక్షుగారు ఈ మొత్తమునంతయు నిరాకరింపవలెనని ప్రతిపాదించుచు కల్లు దుకాణముల వద్ద పికెట్టింగు చేయుట సమంజసమే యనియు ప్రభుత్వమువారి నిర్బంధమువలన పికెట్టింగు అవసరమయ్యెననియు చెప్పెను. ఎక్సైస్ విధానము ఖండించుటకు ఫలితముగాను ఈ కార్యక్రమములను అడంచుటకు అధికపోలీసుల నియమించుట యవసరమయ్యెననియు అందువలన ప్రభుత్వమువారికి ఖర్చు గూడ హెచ్చెననియు ఆయన చెప్పెను.

ఎక్సైస్ శాఖమీద డబ్బు ఖర్చు పెట్టుటవలన ప్రభుత్వమువారికి చాల ఆదాయము వచ్చుచున్నదనియు పికెట్టింగు హానికరమనియు చెప్పుచు గ్రాంటును పూర్తిగానిరాకరింపరాదని సూరో ఒక్కరు చెప్పిరి.

ఎవి సిరెకరమగు పద్ధతుల వలన కలుగుఆదాయము కొరకై డబ్బు ఖర్చుపెట్టుట పనికిరాదని ఇండిపెండెంటు పార్టీవారి నిష్వీర్ బక్షుగారు చెప్పిరి. అన్ని మతములును మద్యపానమును ఖండించుచున్నామని ఆయన చెప్పెను. లా ఆర్డరును రక్షించుట మాత్రమే గాక ప్రజల శీలమునుగూడ రక్షించుట ప్రభుత్వకర్తవ్యమనియు, లాఠీచార్జిలెన్ని జరిగినను కల్లుదుకాణములను తీసివేయించ ప్రజలు నిశ్చయులై యున్నారనియు బక్షుగారు చెప్పిరి.

ఇంకా చాలమంది ఇండిపెండెంటు పార్టీ సభ్యులు ప్రతిపాదనమును సమర్థించిరి. వోటుకు పెట్టగా కోత తీర్మానము అంగీకరింపబడెను సభ్యులు హర్షసూచకములగు కరతాళధ్వనులు గావించిరి. కోత తీర్మానమునకు అనుకూలముగా 25 వోట్లును, ప్రతికూలముగా 13 వోట్లును వచ్చెను. లిబరలుపార్టీ సభ్యులును, హిందువులును, ఇండిపెండెంటు పార్టీతో కలిసి కోతతీర్మానమును సమర్థించిరి. సరిహద్దు రాష్ట్రీయశాసనసభలోనిది మొదటి ప్రభుత్వ పరాజయము.

తరువాత అటవీ శాఖయందలి ఖర్చుకై గ్రాంటు కోరబడెను. దీనినికూడ నిరాకరింపవలెనని చాలమంది చెప్పగా తీవ్ర చర్చ జరిగెను. సభ రేపటివరకు ఆపు చేయబడెను.

---

గుజరాతు సమాచార్ సంపాదకునకు శిక్ష

అహమ్మదాబాదు మే 23:—

గుజరాతు సమాచార్ సంపాదకులు ఇంద్రవార్ ఠాకూరుగారికి ఒకయేడు కఠినశైదు విధింపబడెను.

యంగుఇండియా అసిస్టాంటు మేనేజరుకు శిక్ష

యంగుఇండియా అసిస్టాంటు మేనేజరు జీవంజీ దేశాయిగారికగూడ అదేశిక్ష విధింపబడెను.

---

## కీ॥ శే॥ ఇంచికేపు ప్రభువు

పడవలోబోవుచు మరణించెను

నైసు, మే 24:—

ఇంచికేపుగారు పడవలో బోవుచుండగ ఆకస్మికముగ మరణించిరి. వీరికి 79 ఏండ్లుగలవు. చలిజ్వరముచే చాల బాధపడి స్వస్థత చెంది పడవలో పోవుచుండగ చనిపోయిరి. వైద్యులువచ్చి సహాయముచేయుటకుగూడ వ్యవధిలేకుండెను. వీరు పూర్తిగ స్వస్థతగాంచియు యిపుడు మరణించినందున బంధువులకు, మిత్రులకు ఎక్కువవిచారము కలిగెను. స్టాకు ఎక్సుఛేంజి మూయువరకు యీ వార్త లండనులో ప్రకటింపబడలేదు.

ఇంచికేపుగారి జీవితము

జేమ్సునైలీమాకేగారు

ఇంచికేపు ప్రభువుగారు 1852 సం॥ ఇంగ్లాండు ఫోరుఫారుషైరునందు ఆర్బ్రోతు గ్రామమున జన్మించి ఎల్జినులో విద్యనేర్చిరి. 1874 సం॥ ఇండియాకుబోయి కలకత్తాలోని మెకిన్ను మెకాంజి కంపెనీయందుచేరి, చివరకు ప్రధానభాగస్వామిగా నుండెను. 1891 సం॥ వైస్రాయి శాసనసభయందు సభ్యులుగను, 1897 లో స్టేటుకౌన్సిలు సభ్యులుగ నుండిరి. 1894 సం కె. సి. ఐ. ఇ. బిరుదొసంగబడెను. 1902 సం బాక్సరు విప్లవానంతరము వీరు చీనాలో వాణిజ్య విషయములందు సంధిరాయబారములు జరిపిరి. అపుడు జి.సి.ఎం.జి. బిరుదొసంగబడెను. 1911 సం॥ స్కాటులాండు ఇంచికేపు బారనుగ ప్రభుబిరుద మొసంగబడెను యిరోపా మహాసంగ్రామము ప్రారంభమునకు పూర్వమే ఇంచికేపు ప్రభువుగారు బ్రిటిషు వ్యాపారసులలో ప్రాధాన్యము వహించిరి నౌకావరిశ్రమల ప్రతినిధిగ వీరు చాలకృషిచేసిరి ఇండియాలోను ఇంగ్లాండులోను ప్రభుత్వము కమిటీలలో చాలసార్లు పనిచేసిరి 1921 ప్రభుత్వ వ్యయమును గూర్చిన గెడ్డెసుకమిషను సభ్యులుగ నుండిరి 1922 ఇండియాలోని మితవ్యయ సంఘాధ్యక్షులుగ నుండిరి 1924 సం॥ వైకౌంటుపదవి జి సి ఎస్ ఐ బిరుదు ఒసంగబడెను పి అండు ఓ స్టీము నావిగేషను కంపెనీ అధ్యక్షులుగను, నేషనలు ప్రావిన్షియలు బాంకు మూయజుకెనాలు కంపెనీ అధ్యక్షులుగను వీరు వ్యవహారవర్గములందు చాల ప్రాముఖ్యము గావించిరి.

---

భారతదేశపు తపాలా నౌకర్ల సమావేశము

కలకత్తా, మే ౨౧:—

కలకత్తాలో జూనునెల ౧౪, ౧౫ తేదీలలో అఖిలభారత పోస్టాఫీసు ఆర్, యం. యస్. కాన్ఫరెన్సు జరుగును. అజహారుఆలి. యం. యల్. ఏ. గారు అగ్రాసనాధిపత్యము వహింతురు.

లాహోరులో

హిందూ మహమ్మదీయ

కొట్లాటలు

ఒక హత్యా కేసులోతీర్పు

లాహోరు, మే 23

ఇటీవల జరిగిన హిందూ మహమ్మదీయకొట్లాటలో హత్యచేసినందులకుకు శాలచందురోషను లాలు గార్లపైనను తేబడిన కేసు నేడు విచారణ జరిగినది. సెషన్సుకు పంపబడెను.

## సమకాలికాభిప్రాయము

"హైదరాబాదు బులెటిను" నుండి

"ప్రభుత్వమువారి విద్యావిధానము మారవలెను"

ఆంధ్రబాలికల ఉన్నత పాఠశాల

హైదరాబాదులోని ఈ పాఠశాల అనేక కారణములవలన ఈ రాష్ట్రములోని విద్యాసంస్థలలో అసాధారణమైనదని చెప్పవచ్చును. మొదటి కారణమేమన, దీనిలో చెప్పబడు విద్య మాతృభాష ద్వారా నేర్పబడుచున్నది. రెండవ కారణము ఏమన, ఇది ఆంధ్రులవలన నడుపబడుచున్నది. మూడవకారణము ఏమనగా, ప్రభుత్వ సహాయము ఏమాత్రము లేకుండ కేవలము ప్రజాసహాయముననే స్వతంత్రముగా నడచుచున్నది. ఎట్టి ఉన్నత తత్త్వమైనను సరే, దానిని మూఢవిశ్వాసములోనికి లాగిన పక్షమున అందలి యోగ్యత నశించును. ఉర్దూభాషయే బోధనసాధనముగ (Medium of instruction) అన్ని పాఠశాలలందును నిర్బంధ పరచినందున, ఏదో సంప్రదాయముల జనుల మాతృభాషలు ఉర్దూ కానో ఆ సంప్రదాయములవారికి అపరిమిత నష్టము కలుగుచున్నది. నిజాము రాష్ట్రములో ఉర్దూ మాతృభాషగాగలవారి సంఖ్య అతిస్వల్పము. కనుక ఆంధ్ర, మహారాష్ట్ర కర్ణాటక భాషలవారికి ఇంకెంత అనరాని బాధ కలుగుచున్నది. దీనికి ఆంధ్రబాలికలఉన్నత పాఠశాలయొక్క యుదాహరణము. ఈ పాఠశాలవారు ప్రభుత్వవిద్యాశాఖను "మా పాఠశాల బాలికల పరీక్షను జరుపు ఏర్పాటులు చేయవలసినది" అని ప్రార్థింపగా వారు నిరాకరించినందున పూనా నగరములోని కర్వే గారి మహిళా విశ్వవిద్యాలయము వారిని తమ పాఠశాలను అంగీకరించుటకై ప్రార్థింపవలసివచ్చెను. ప్రభుత్వోద్యోగముల కోరువారు ఉర్దూ తప్పక నేర్చియుండవలయునను ప్రభుత్వమువారి ఆశయమును మేమొప్పుకొనుచున్నాము కాని ఉద్యోగముకొరకు కాక విజ్ఞానముకొరకు చదువు నేర్వవలసిన బాలికలను "అదృష్టవశము చే ప్రేమింపబడిన" ఉర్దూభాష ద్వారా విద్య నేర్చుకొనవలయునని అంధప్రాయముగా పట్టుబట్టుట వలన హిందూ బాలికల విద్యాభివృద్ధి యవకాశములు తప్పిపోవుచున్నవి. ఇట్టి విద్యాలయమును ప్రభుత్వము వారంగీకరింపకుండుట అమర్యాదయేగాక, అన్యాయమగు విషయము. విద్యాశాఖ ఇంత మాత్రముతో తృప్తిపొందలేదు. ఒక అడుగు ముందుకు కూడ పెట్టినది. మహా ఘనతవహించిన ప్రభువుగారికిగల విద్యాభిమానమెంత గొప్పదనగా వారు రాష్ట్రమునకు బయటనున్న ఎన్నియో విద్యాలయములకు ప్రతిసంవత్సరము విరాళములను సక్రమముగా గ్రహించుచున్నారు. ఇంతటి ఉదారభావము ఈ పాఠశాల విషయమున ఏల ఉపయోగింపబడుట లేదో మరూహ్యముగా నున్నది. విద్యాశాఖవారీ పాఠశాల విషయమున నవలంబించినవిధానము, పాక్షికభావసూచకమే మోయని మాకు భయముగ నున్నది. కాని పాఠశాలాధికారులు తమపనిని ప్రభుత్వ సహాయము లేకయే నడుప నిశ్చయించి యుండుట యోగ్యముగ నున్నది. ఇట్టిపద్ధతివలన దేశము నిరక్షరత ప్రబలును. దేశమునందలి యజ్ఞానమును తొలగించవలసియున్నచో ప్రభుత్వము వారి విద్యావిషయిక మగు రాజనీతి త్వరలో మారవలసి యున్నది.

## దక్కన్ మానవ సేవాసమితి సికింద్రాబాదు

దిని ౬ వమే తేదిన సికింద్రాబాదు మార్కెటువీధియందలి జంపైకు హాలునందు పైసమితి పక్షమున కీర్తిశేషులగు యమ్. నాగయ్యనాయుడు గారిని గూర్చిన పరామర్శికసభ శ్రీమాన్ కే. తాతాచారి బి. ఎ. బి. యల్. గారిఅధ్యక్షతను జరిగెను. కీర్తిశేషులయిన నాయుడుగారిని గూర్చి పెక్కండ్రు ముచ్చటించిరి. కీ॥ నాయుడుగారు పైసమితికి ౩ వత్సరములగ సంయుక్త ప్రదర్శిగనుండి మిగుల నుత్సాహముతో ననేకకష్టములకోర్చి సమితికార్యములను శ్రద్ధతో నిర్వహించిరి. నాయుడుగారు మొక్కసమితిలోనే గాక రైల్వే యూనియన్ లోగూడ కోశాధిపతులై యూనియన్ యభివృద్ధికి నలువురు సలహాల నొసంగి తమజీవితమును ప్రజాసేవయందే యుపయోగించిరి. వీరు నిగర్వమూర్తియై శుభాశుభ కార్యములన్నిటికి పిలిచిన పిలువకున్న విచ్చేసి శక్తివంచనలేక సాయము చేయువారు.

ఇట్టి యుదారగుణులు కావుననే కాశీక్షేత్రమునందు హిందువులు తిరిగి జన్మలేదని తలంచుచున్న క్షేత్రమున స్మృతినొంద కాంక్షించితిరో, అట్టి పవిత్రస్థలమునందు యాత్రార్థము వెళ్లి అందునే కాదశి పవిత్రదినమునందు పరమపదించియున్నారు. భార్యను సోదరులను దుఃఖాబ్ధిని ముంచి వేగిన వీరి యాత్మకు పరమేశ్వరుడు ఆ కాశీ విశ్వనాథుడు శాంతినొసగు గాక.

అధ్యక్షుల క్రింది తీర్మానములు ప్రవేశపెట్టుచుహాజనులెల్లరు నిలిచి తను మంగీకారమును గతించిన నాయుడుగారి పైగల యభిమానము వేనోళ్ల చాటుచున్నది. ప్రతివారు వారొనర్చిన ఘనకార్యములనుతలచువారే అతని త్యాగమును స్మరించువారే, అతని యాదార్శ్యమును గొనియాడువారే అట్టియుదారుని గోలుపోయినందుకు సమితివారి దుఃఖ మపారము.

తీర్మానములు

౧ సమితియొక్క కార్యదర్శియై దేశసేవచేసిన వర్సి కాశీక్షేత్రమునందు పరమపదించిన కీర్తిశేషులగు నాగయ్యనాయుడు గారి యకాల మరణమునకై యీసభవారు విచారించుచు వారి మహాత్ముని యాత్మశాంతికై భగవంతుని ప్రార్థించుచున్నారు.

౨. శ్రీయుత నాగయ్యనాయుడు గారి యకాల మృత్యువువలన గలిగిన యపారదుఃఖమునకు వారి కుటుంబమునకు యీసభవారు తమసానుభూతిని తెలియ జేయుచున్నారు.

౩. పైతీర్మానములు వారికుటుంబమునకు దెలియజేయుటకు కార్యదర్శికి యీసభవారధికార మొసంగుచున్నారు.

సికింద్రాబాదు (౬-౫-౩౯)    ఇట్లు
యస్. శ్యామరావు
గౌ॥ కార్యదర్శి

## క్రికెట్టు

అఖిలభారత జట్టుకును, యం సి. సి. కిని పోటీ

సి. కే. నాయుడుగారు అద్భుతముగ ఆడి అవుటు కాకుండా ౧౧౬ పరుగులు గావించుట

లండన్, మే ౨౦

అఖిలభారత క్రికెటుజట్టుకును యం.సి.సి. జట్టునకు నేటిదినము, లార్డ్సునందు ప్రారంభమైన పోటీలో, భారతీయులు మొదట తమ ఇన్నింగ్సును ఆడి నేడుపోటీ ముగియు కాలమునకు ౭ గురు అవుటయి ౨౩౬ పరుగులు గావించిరి. సి. కే. నాయుడుగారు అత్యద్భుతముగ ఆడుచూ అవుటు కాకుండా ౧౧౬ పరుగులు గావించిరి నాయుడుగారు ౧౩ బౌండరీలను, ఒకసిక్సును కొట్టిరి. పోటీని చూచుటకు సుమారు ౨౦౦౦౦ మంది ప్రేక్షకులు వచ్చియుండిరి. పోటీ ప్రారంభములో వాజరు అలీ గారికి కణతపై బంతిదెబ్బతగిలి, వారు ఆట మానవలసి వచ్చెను. కోలా గారు బాగుగఆడి ౩౧ పరుగులు గావించిరి

సుభాష బోసుగారు ౨౫ పౌనులు తగ్గుట

ఆప్పుడప్పుడు జ్వరము తగులుచున్నది సిరోగానికరిడ లేదు.

నాగపురము, మే ౨౬.

సిరోగాని చెరసాల నుండి ఈక్రింది విషయములు తెలుపుచు సుభాష చంద్రబోసుగారు ఒకమిత్రునికి ఉత్తరము వ్రాసెనని ఒకపత్రికలో ప్రచురింపబడినది బోసుగారు ౨౫ పౌనులు బరువుతగ్గిరి. అప్పుడప్పుడు ఆయనకు జ్వరము వచ్చుచున్నది. సిరోగాని యొండ ఆయనకు జబ్బుచేయుచున్నది.

బీహారు డిక్టేటరు శిక్ష

పాట్నా, మే ౨౬

బీహారు రాష్ట్రపు ౩ వ డిక్టేటరు అబ్దుల్ బారిగారికి పాదరేపబు డివిజనలు మేజిస్ట్రేటు క్రి. లా. స. చట్టము ౧౭ (౨) ప్రకారము ౧౮ నెలలు శిక్ష రూ. ౨౦౦ జరిమానా యివ్వనిచో ౨ నెలలు కఠినశిక్ష విధించిరి. పలుతావుల నుండిసాక్షులు గప్పింపబడిరి. విచారణజెయిలులోనే దీర్ఘకాలము జరిగెను.

## ప్రకటన

బీదరెడ్డి విద్యార్థులకు తెలియపరచడ మేమనగా అమర్దాదు నెల ౧౩౪౯ ఫ. నుండి హాస్టలుపక్షమున సర్తగలవారికి నుపకారవేతనములు రొసగబడును. కావుననిష్టమున్నవారు దరఖాస్తు పై తమయొక్క బీదతనమును గుర్తించుటకై రెడ్డిజన సంఘసభ్యుని అభిప్రాయమును వ్రాయించి ప్రాగెను రిపోర్టుసహా దరఖాస్తు ౧౦ వ తేది అమర్దాదు వరకు రెడ్డిహాస్టలునకు పంపుకోవలయును. తరువాత వచ్చినదరఖాస్తులు అంగీకరింపబడవు. దరఖాస్తు ఫారములు రెడ్డిహాస్టలులో చిక్కగలవు కనీసము మిడిలుతరగతిలో నుత్తీర్ణులైనవారి దరఖాస్తులే గైకొనబడును.

ఇట్లు
వి. వి. రంగారెడ్డి,
కార్యదర్శి.
రెడ్డిహాస్టలు హైదరాబాదు

## బైయిండియను లీగు

అఖిలభారత స్వదేశీ దినము

శ్రీయుత బి శివరావు గారిట్లు వ్రాయుచున్నారు

రాబోవు ఆదివారము ౨౬ వ తేది అఖిలభారత స్వదేశీ దినముగా జరుపబడవలసి యున్నది. దక్షిణదేశములో నింకను అనేక పట్టణములందును, తాలూకా హెడ్ క్వార్టరు లందును కూడ, బైయిండియను లీగుయొక్క శాఖలు తెరువబడవలసి యున్నవి. ఈ కార్యమునకు మనము వెంటనే పూనవలెను. స్వదేశీస్టోర్లు యింకను తెరువబడవలసిన స్థలములుకూడ అనేకమున్నవి. దేశమంతటను స్వదేశీ వాతావరణము నిండియున్న ప్రస్తుతదినములలో బై ఇండియను లీగు సభ్యులు స్వదేశీ స్టోరులను తెరచుట అసాధ్యమగు పని కాదు. కాలికట్టులో నొక క్రొత్త స్వదేశీ భాండారము ౨౮ తేదిన తెరువబడనున్నది. కోయంబుత్తూరులో ౧౧ వ తేదిన తెరువబడిన స్వదేశీ స్టోర్సు చురుకుగా పని చేయుచున్నదని వినుచున్నను పాలకొల్లునందొక స్వదేశీ స్టోర్సు కొరకు రూ ౩౦౦౦ వసూలు చేయబడినవని తెలియుచున్నది. ఈయుద్య మారంభము నుండి స్వదేశీ వ్యాపారము విశేషముగా నభివృద్ధి యగుట చాల ప్రోత్సాహకరముగ నున్నది.

ఈరాష్ట్రమందలి స్వదేశీ వ్యాపారస్థులందరును తమపేర్లను మా కార్యాలయమునకు పంపగోరుచున్నాను. స్వదేశీస్టోరుల యొక్క పూర్తియగు జాబితా మా కార్యాలయమం దుండినచో స్వదేశీ వర్తకులందరికిని చాల యుపయోగపడగలదు.

అఖిలభారత స్వదేశీ దినమందు అనుసరింపబడవలసిన కార్యక్రమము, ఆయా స్థలములందున్న బై ఇండియనులీగు శాఖలచేతనే నిర్ణయింపబడవచ్చును, కాని, ఎట్టి యల్లరియును రాకుండ తప్పించుటకుగాను, కార్యక్రమము గూర్చి ఆయా స్థానికాధికారులకు ముందుగా తెలియపరచుట క్షేమకరము. లీగునందు సభ్యులను చేర్చుట, స్వదేశీవస్తువులను వీధులలో అమ్ముట, బహిరంగ సభలను జరుపుట, మున్నగు కార్యములన్నియును. అధికారుల యొక్క యనుమతిమీదనే సాధ్యమగునంత వరకు జరుపబడవలెను.

ఒకటిరెండు స్థలములలో బై ఇండియనులీగు సభ్యులు కొందరు కాంగ్రెసును దూషించుచు ఉపన్యాసములను గావించిన ఫిర్యాదులు చేరినవి. మరియొక స్థలమందు జస్టిసుపార్టీని దూషించుచు కొందరు సభ్యులు ఉపన్యాసమును గావించిరని కూడ ఫిర్యాదులు చేరినవి. మన సంస్థకు రాజకీయములతో నెట్టి సంబంధము లేదనియు, స్వదేశీ యభివృద్ధి యొక్కటే మన యుద్దేశ మనియు, సభ్యులందరును గ్రహింపవలెను. మన యొక్క రాజకీయ మతము లెట్లున్నను, యీ యుద్యమమునందు అందరకు కలిసిపనిచేయుట అసాధ్యము కాగూడదు.

కంజీవరము ప్రదర్శనము చాల తృప్తికరముగా జరుగుచున్నది. ప్రదర్శనమునకు తోడ్పడుటకు మాచే కోరబడిన ప్రభుత్వశాఖల యుద్యోగులు తమ వస్తువుల నన్నిటిని ఆంగ్లభాషలో వ్రాయబడిన పోస్టర్లతో మా ప్రదర్శనశాలకు ౧౦౦ గజముల దూరమున ప్రదర్శించుటకు బదులుగా, తమవస్తువులకొరకు మా ప్రదర్శనశాలనే యుపయోగించి యుండినచో, బాగుండెడిది. ప్రదర్శనమును చూడవచ్చిన గ్రామస్థులకు తమ పోస్టర్లను బోధపరుచుటకు మా వాలంటీర్లు సహాయపడుటకు వీలయ్యెడిది. ఇకముందైనను యిట్టి ప్రదర్శనములకు జాతీయ నిర్మాణ శాఖల నుండి యింక నెక్కువ సహాయము వచ్చునని తలచెదను.

## మదరాసు పికెటింగు

మదరాసు, మే ౨౪:—

నిన్న సాయంకాలము ౧౩ గురు వాలంటీరులు దేవరాజమొదలి వీధియందు, నటను బజారునందు విదేశవస్త్ర దుకాణముల వద్ద పికెటింగు చేయుచుండగ పోలీసువారు అరెస్టుచేసిరి. తరువాత నల్గురు స్త్రీలువచ్చి పికెటింగుచేసిరి. వారిని గూడ అరెస్టుచేసి పోలీసు కమీషనరు కార్యాలయమునకు గొంపోయిరి. పిదప అందరిని విడుదలచేసిరి.

అరెస్టులు

౨౩-౫-౧౯౩౦ సం॥ తేదీని రటన్‌బజారునందు రాజా సుందరంశెట్టి విదేశ వస్త్రాలయము వద్దను సాయంకాలము ౫ గంటలకు శ్రీయుత యమ్. బంగ్రరాజు, యస్. రామమూర్తి గార్లు ఒకజట్టుక్రింద పికెటింగు చేసినారు. ౫ ౧/౨ గంటలకు పోలీసువారు వచ్చి అరెస్టుచేసి తీసుకొనిపోయిరి. తరువాత శ్రీయుత విశ్వనాథరాజులు, పి సత్యనారాయణాచారి, సి. లోకనాథ, పక్కిరుస్వామి నాయుడుగార్లు రెండవ జట్టుక్రిందను పికెటింగు చేసినారు. వారిని కూడా అరెస్టుచేసి స్టేషనుకు గొంపోయిరి. ౬ గంటలకు సి. యమ్. వరదరాజులునాయుడు, కే. బాలయ్యచెట్టి సి. వెంకటేశన్‌గార్లు మూడవ జట్టు క్రిందను పికెటింగు చేసినారు. పోలీసువారు వారిని కూడా అరెస్టుచేసిరి. ౫ ౧/౨ గంటలకు దేవరాజ మొదలి స్ట్రీటునందలి విదేశ వస్త్ర దుకాణముల వద్ద యమ్. కె. అప్పలస్వామి, బి. సుబ్బరాజు, యమ్ రామస్వామిరాజు, యస్, పెరుగూళ్లరాజు రెండుజట్టుక్రిందను పికెటింగుజేసిరి. పోలీసువారువారిని అరెస్టుచేసిరి. యీనాలుగు జట్లను పోలీసు కమీషనరు కార్యాలయమునకు తీసుకొనివెళ్లి ఫోటోగ్రాఫ్‌తీసి రాత్రి ౯ గంటలకు కొందరిని ౧౦ గంటలకు కొందరిని విడుదలచేసినారు.

## బళ్లారి జిల్లాలో క్షామము

పరిహారార్థమై కొన్ని పనులను ప్రారంభింప సంకల్పము

ఉదకమండలము, మే ౨౩:—

ప్రస్తుతము బళ్లారి జిల్లాలో క్షామ నివారణకై యనుసరించుచున్న పద్ధతులకు బదులు పరిహారార్థమై కొన్నిపనులను ప్రారంభింప మద్రాసు ప్రభుత్వమువారు నిశ్చయించిరి. ఈపనులు ఫామిన్‌కోడ్ననుసరించియుండును. బళ్లారిలో త్వరలో ఫామిన్ కమిషనరగు సి. ఏ. సౌడరుగారిచే ప్రారంభింపబడు ఈపనులు ఫామిన్ కోడ్ననుసరించి సహాయ మవసరమా, లేదాయని నిర్ణయించుట కుద్దేశింపబడియున్నది.

## ఏలూరు అరెస్టులు

ఏలూరు మే ౨౪:—

గుంటు కృష్ణమూర్తిగారు టి. వెంకట్రామయ్య చౌధరిగారు నిన్న సాయంకాలము అరెస్టు చేయబడిరి.

మునిసిపాలిటీవారు లైసెన్సు ఫీజు ఎక్కువ చేసినందున నిన్న ఉదయమునుండి బండివాండ్లు సమ్మెకట్టిరి. ప్రజలకు యిబ్బందిగ నున్నది.

## బొంబాయి అల్లరులు

పార్లమెంటులో ప్రశ్నలు

కాంగ్రెసు వలంటీర్లను హోరుగారు మెత్తి పొడుచుట

లండను మే ౨౩:—

శ్యామ్యుయల్ హోరుగారు పార్లమెంటులో ఈదినం బొంబాయి అల్లరులను గూర్చి జవాబిచ్చుచు శాంతి సంపూర్ణముగా నెలకొనవఱకు తిరిగి కలహములు జరుగునని నమ్మకము దోచువఱకు బొంబాయి ప్రభుత్వమువారు తమ బందోబస్తును మానరని తెలియ జేసిరి. మే ౨౧ లోపల అల్లరులవలన హతులు ౧౩౦ మంది గాయపడినవారు ౧౬౪౦ మంది యనియు, ౧౩౬౬ మంది అరెస్టుచేయబడిరనియు చెప్పిరి.

హిందూ ప్రజలపై తమకు విశేష ప్రభావము గలదని కాంగ్రెసు వలంటీర్లు శాంతి నెలకొల్పుటకు ప్రభుత్వమునకు తోడ్పడిరాయని వార్డులా మిల్నిగారు ప్రశ్నించిరి. వలంటీర్లు సహాయము మాట యటుండగా, కొన్ని చోట్లను యిబ్బంది కలిగించువారు నైయుండిరనిహోరుగారు జవాబిచ్చిరి.

బొంబాయిలో సోమవారమునాడు స్థితిగతులు

బొంబాయి, మే ౨౩:—

బొంబాయి పురమున మెల్లగా మామూలు పరిస్థితులు నెలకొనుచున్నవి. మధ్యాహ్నము లోపల అల్లరి ప్రాంతములలో ముగ్గురు మాత్రమే కొట్టబడిరి. కాని యిప్పటికిని హిందువులు ముసల్మాను వీధులకు ముసల్మానులు హిందువుల వీధులకు వచ్చుటకు జడియుచున్నారు. గవర్నరుగారు పోలీసు కమీషనరు సర్ పాట్రిక్ కెల్లీ గారితోటి యీదినం ఉదయం అల్లరి బస్తీలను చూచివచ్చిరి.

బొంబాయిపౌరుల సమాధాన సభ తరఫున హిందూ ముసల్మాను ప్రముఖుల సంతకములతో నొక విజ్ఞాపన ప్రకటింపబడినది. హిందువులును మహమ్మదీయులును సోదరభావముతో మెలగవలయుననియు పరస్పరము విశ్వాసము జూపవలయుననియు అందఱును ఒకే నగరవాసులనుట మఱువరాదనియు హెచ్చరిక చేయబడినది.

అల్లరుల సమయమున అరెస్టైనవారిని ౭౫ మందిని రాజధాని మేజిస్ట్రేటు ముందు హాజరుపెట్ట జూన్ ౪ వఱకు రిమాండులో నుంచిరి.

### సూరతు అరెస్టులు

సూరతు, మే 23:—

37 వ నియంత హారిభాయి దేశాయిగారు, మఱొకరు దర్శనదాడిరోజు జరిపినందులకు అరెస్టు చేయబడిరి. చిక్లీలో ఈసందర్భముననే నల్గురు అరెస్టుచేయబడిరి.

### లాహోరు అరెస్టులు

లాహోరు, మే 23:—

విద్యార్థి సంఘాధ్యక్షుడు శార్దూలసింగుగారి భార్య ప్రకాశకార్ నిన్న రాత్రి క్రి. ప్రొ 108 క్రింద అరెస్టుచేయబడెను.

బజాజు హట్టా గుడ్డల దుకాణముల పికెటింగు చేసి నిన్న ఇర్వురు వలంటీర్లు అరెస్టయిరి.

కాంగ్రెసు కరపత్రములు పంచిపెట్టి ఒక సింధీ యువకుడు అరెస్టాయెను.

### కాన్పూరులో కాంగ్రెసుప్రచారము

కాన్పూరు, మే 23:—

కాంగ్రెసువాదులు తమ ప్రచారమును గ్రామములకు మరల్చినారు. పన్నులు చెల్లింపరాదని చేముద్రణయంత్రములమీద కరపత్రముల నచ్చొత్తి పంచిపెట్టుచున్నారు. 11 మంది అరెస్టు చేయబడి యీదినం కాన్పూరునకు కొనిరాబడిరి. ఇందులో నొకరు హరిలాల్ వర్మగారు. వీరు కోర్టులో కాంగ్రెసు ధ్వానములు సలిపిరి. నెంటనే వారికి 3 నెలలు ఖైదు. రూ 11 జరిమానా విధింపబడెను. జమీందార్ల సభవారు కాంగ్రెసు ప్రచారమును ప్రతిఘటించుటకు చాలా కృషి సలుపుచున్నారు.

### 15 బస్తాలచక్కెరను సుంకములశాఖవారు స్వాధీనము చేసికొనుట

నాగపట్టణం, మే 21:—

అక్రమముగా ఫ్రెంచిరాజ్యమైన కారెక్కాలు నుండి 15 బస్తాల చక్కెరను బ్రిటిషురాజ్యమైన నాగపట్టణంలోనికి కొందరు అక్రమ వ్యాపారులు తెచ్చి దానిని సముద్రతీరమున పంచుకొనుటలో కలహించుచుండిరి. ఆయలజడివిని పోలీసు, కస్టమ్సు యుద్యోగులు నక్కడకువెళ్లగా, వారందరు సరకులవిడిచి పారిపోయిరి. సరకుల గవర్నమెంటువారు స్వాధీన పఱచుకొందురు.

### బారిస్టరు అభయంకరుగారి ఆరోగ్యస్థితి

### కుటుంబవైద్యుడు చూడ గోరగా అనుమతి నియ్యకపోవుట

నాగపూరు, మే 24:—

నాగపూరు చెరసాలలో నున్న బారిష్టరుఅభయంకరుగారికి జబ్బుగా నున్నదని తెలిసి వారి కుటుంబవైద్యుడు వారిని చూడగోరగా వారు నిరాకరించి అభయంకరుగారు చిరకాలమునుండి అతిమూత్రవ్యాధి రొమ్మునొప్పి, కడుపులోశూలముఉన్నగు వాటివలన బాధపడుచుండుట వారి బంధువులకు చాల ఆందోళనముగా నున్నది. మూడునాళ్లనుండి కడుపులో కుడిప్రక్కను కాలేయమునకు క్రిందుగా ఒక్కకంతిపెరిగి బయలు దేరినది. అది 3¼ అంగుళముల పొడుగును 3 అంగుళములు వెడల్పును కలిగియున్నది. దగ్గినపుడు కొద్దిగా బాధగా నుండును. బీజములుగూడ వాచినవని తెలిసినది. మూత్రముగూడ సరిగా వెళ్లుటలేదు. డాక్టరులు పరీక్షచేయుట అవసరమైయున్నది. ఎవరైన మాటలాడుటకు వచ్చినచో మధ్యగా నొక యినపతెడికెను స్పెక్టరు దానివెలుపలనుండి మాటాడవలెను. అందువలన అభయంకరుగారు రెవ్వరితోడను గూడ మాట్లాడుట మానివేసిరి.

### "కిచనరుని జంపిన వ్యక్తి"

న్యూయార్కు, మే 23:—

న్యూయార్కులో ఒకవ్యక్తిని అరెస్టుచేసిరి. ఇతని దగ్గర దొరికిన దినచర్య పుస్తకములో ముఖపుటమీద 'కిచినరును జంపిన వ్యక్తి' యని వ్రాయబడి యుండెను. ఈవ్యక్తి పూర్వము వార్తాపత్రికా విలేఖరిగ నుండెనట. బోయరు యుద్ధములో ఇంగ్లాండుపైపోరెను. అంతర్జాతీయ సాహసకార్య సక్తుడు 1919 లో యునైటెడుస్టేట్సులో ఇతడు అరెస్టుచేయబడెను. కానివిమానమెక్కి మెక్సికోకు పారిపోయెను. బ్రిటిష్ నౌకను తగుల బెట్టిన సందర్భమున బ్రిటిషు అధికారు లీతనిని పట్టుకొనగోరిరి అతనివద్దగల దొరకిన దినచర్య పుస్తకములో ఆర్క్నీను దీవుల పటము అడ్డుగీతతో ఆనవాలుగా గుర్తింపబడెను. ఈ అడ్డుగీత యున్నచోటున కిచనరు ప్రభువుచంపబడెనని వ్రాయబడెను. హ్యాంప్షైరు క్రూయిజరు మునిగిన చోటునకు దీనికి చాలసామీప్యము 1919 లో అమెరికాలో అరెస్టయినపుడు ప్రేలుడు వస్తువుల పెట్టెలను రహస్యముగ రవాణా చేయుచుండెనను నేరముమోపిరి. పెన్సిల్వేనియా పొగయోడపై వీటిని గొంపోవుచుండెను. ఏవో ప్రేలుటచే నౌక మునిగిపోయెను. చాలమంది చనిపోయిరి.

### "బొంబాయి సమాచార్" పత్రిక సంపాదకుని అరెస్టు

బొంబాయి, మే ౨౩:-

గుజరాతీ దినపత్రిక "బొంబాయిసమాచార్" సంపాదకుడు పరిచురణ కర్తయగు జయంతిలాల్ హాతీభాయి అమీనుగారు అవసరాధికార శాసనము ౨౧ వ సెక్షను క్రిందను, క్రిమినలులా సవరణ చట్టము ౧౭ (౧) క్రిందను అరెస్టు చేయబడిరి.

### బొంబాయిలో కాంగ్రెసు పికెటింగు

### ముగ్గురి అరెస్టు

బొంబాయి, మే ౨౩:—

ఒకవారం రోజులు అల్లరులవలన కాంగ్రెసు కార్యక్రమము ఆగియుండెను. తిరిగి యీ దినం బైబవేరే యస్లేకంపెనీ ముందు ముగ్గురు కాంగ్రెసువలంటీర్లు ప్రత్యక్షమైరి. వారిని పోలీసులు అరెస్టుజేసిరి. అందులో యిద్దఱికి వరుసగా, ఐదు ఆరునెలలు కఠినఖైదు విధింపబడెను. మూడవ నాడు నిర్దోషి యని చెప్పకొన్నందున వానిపై కేసింకను పరిష్కారము కాలేదు.

### పూనా శిక్షలు

పూనా, మే ౨౩:—

శాతారాం దండీరాం, నంకూద్రేదాడూ అప్పాజిదంద్రేగార్లకు ౪ నెలలు కఠినఖైదు రు ౧౫౦ జరిమానా విధింపబడిరి. వీరు కాంగ్రెసు బులెటిను పంచియుండిరి. మొన్నటియందు ౧౬ వ తేదీని అరెస్టుచేయబడిన వలంటీర్లు కిద్దఱికి౬ నెలలు కఠినఖైదు విధింపబడెను.

### మొహరం అల్లరి

### ఒక గ్రామములో హిందువులను హింసించుట

అలహాబాదు మే ౨౩:-

బారెల్లీ జిల్లాలో పరేవా గ్రామంలో ౧౭ వ తేదినాడు మొహరంపండుగ సేయుచున్న ముసల్మానులు హిందువులపై ద్వేషించి హిందూగృహములకు నిప్పంటించి, కొందఱు హిందువులను అనిప్పులలోనికి పాఱవేసిరి. ౨౬ మందికి తీవ్రమైన గాయములైనవట. చాలా మంది అరెస్టుజేయబడిరి.

### జెసూరు గవర్నమెంటు సారశాలలో దోపిడి

### బడికాపలా వాండ్రను బాకులతో బెదరించుట

జెసూరు, మే ౨౧:—

జెసూరు గవర్నమెంటు సారశాలయందు నిన్నటిరాత్రి దోపిడి జరిగెను. దోపిడిదార్లు బడికాపలావాండ్రను బాకులతో బెదరించి తరిమివేసిరి. వివరములు తెలియలేదు.

### డక్కా మైలు దోపిడి

### ఇంకొకరి అరెస్టు

మున్షిగంజి, మే ౨౧:—

ఈమధ్య జరిగిన డక్కా మైలు దోపిడి సందర్భమున జగన్నాథ యింటరుమీడియెటు కాలేజిలో మొదటి సంవత్సరము తరగతివిద్యార్థియైన సునిల్ముజుందారు అనునతనిని అరెస్టుచేసిరి. ఇప్పటికి యీసందర్భమున ౧౨ మంది అరెస్టయిరి.

# సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (లిమిటెడ్)

## కేంద్రస్థానము బొంబాయి

| | |
|---|---|
| ఇతరులచే నిలువ చేయబడిన పెట్టుబడి | రు 3,86,00,000 |
| తిరిగి వాపసు యివ్వబడిన పెట్టుబడి | రు 1,68,00,000 |
| భాగస్థులయొక్క రిజర్వుడు లైబులిటీ | రు 1,68,00,000 |
| రిజర్వు మరియు కంటిన్ జెన్సీ ఫండు | రు 70,00,000 |

భారత దేశమునందలి ముఖ్యపట్టణములయందంతటను దీని శాఖలుగలవు.

స్థానిక శాఖలు:— హైదరాబాదు, సికింద్రాబాదు

చాలా డిపాసిట్టులు:— హాలీ, మరియు బీజీ చలామణిలలోగూడ ఖాతాలు తెరువబడును. ఒకే మనిషి రెండు చలామణీలలోగూడ ఖాతా తెరుచుకొనవచ్చును.

సేవింగుబ్యాంకు డిపాసిట్సు:— హాలీ, బీ.జీ రెండుచలామణులలోగూడ ఖాతాలు తెరువవచ్చును. హాలీకి 3½ మిత్తి బీ.జీ కి ౪ ఇవ్వబడును. ఒకే రెండుచలామణులలోగూడ ఖాతాలు తెరువచ్చును.

నిర్ణయమైన డిపాసిట్లు మరియు కొద్దికాలపు డిపాసిట్లు — దీర్ఘకాలపు డిపాసిట్లను, కొలదికాలపు డిపాసిటులను, రెండు చలామణులలోగూడ సమంజసమైన వడ్డి రేట్లపైన దీసుకొనబడును. వడ్డి రేట్లు దరఖాస్తుపెట్టి తెలుసుకొనవచ్చును. స్టెర్లింగు డ్రాఫ్టు మరియు టెలిగ్రాఫి ట్రాన్సుఫర్సు- నేరుగా హైదరాబాదునండియే పంపబడును.

బంగారు కమ్ములు (Goldbard) చక్రవర్తిగారి టంకశాలలో అచ్చొత్తబడిన పది తులముల మరియు అయిదుతులముల బంగారు కమ్ములు అమ్మకమునకు సిద్ధముండును.

సేఫ్టిక్టడీ- కట్టబడిన ప్యాకేజులున్ను మరియు సెక్యూరిటీలు భద్రముగానుంచు బాధ్యతపై గైకొనబడును మరియు ఆఖరివాసిపై మిత్తి గైకొనబడును.

అన్నివిధములైన బ్యాంకువ్యవహారములు జరుపబడును.

# ది స్టార్ ఆఫ్ ఇండియా

## ఇండస్ట్రియల్ అండుజనరలుఅస్యూరెన్సు కంపని లిమిటెడ్ మద్రాసు

### 5 స్టార్ ముఖ్యవిషయములు

1 మిగుల తక్కువ ప్రీమియములు
2 డాక్టరు పరీక్షలేదు
3 శాస్త్రీయమగు స్కీములు
4 విభాగపద్ధతి లేదు
5 గవర్నమెంటు సెక్యూరిటీలు కలవు

| | |
|---|---|
| గవర్నమెంటు సెక్యూరిటీలు | రు 65000 |
| చెల్లించిన క్లయిములు | రు 150000 |
| సంవత్సర ఆదాయము | రు 150000 |

శ్రద్ధతో గ్యారంటిగా పనిచేయబడును.

ఏజంట్లు ప్రతి జిల్లా తాలూకాలలోను కావలయును.

ఇట్లు
చీఫ్ సెక్రటరి
ది. స్టార్ ఆఫ్ ఇండియా ఇండస్ట్రియల్ అండు జనరల్
అస్యూరెన్సు కంపెని లిమిటెడ్ హనుమకొండ

# ఆంధ్రబ్యాంకు లిమిటెడ్

## హైదరాబాదు దక్కను

### వడ్డీల వివరము

| | |
|---|---|
| కల్దారు సేవింగ్సు బ్యాంకు ఎక్కౌంట్లు | 4½% |
| హాలి సేవింగ్సు బ్యాంకు ఎక్కౌంటు | 4% |
| హాలీ లేక కల్దారు కరెంటుఎక్కౌంట్లు (జనవరినుండి జూన్వరకు) | 3½% |
| కల్దార్ కరెంటు ఎక్కౌంట్లు (జూలైనుండి డిసెంబరువరకు) | |

ఎక్కౌంట్లు ఒక్కరి పేరనే హాలీలోను కల్దార్లోను తెరువవచ్చును.
ఫిక్సుడ్ డిపాజిట్లు తీసుకొనబడును.
రేట్ల వివరములు. బ్యాంకునందు తెలుసుకొనవచ్చును.
బ్యాంకు ఉదయం 9 గంటలనుండి తెరచి యుండును.

శాస్త్రి ఎం. ఏ. సర్. ఏ. ఐ. బి.
సెక్రటరి

ఎస్. ఎమ్. పిఎస్. విజయం
ఏజంటు

# శ్రీకృష్ణాభవను హోటలు

## అబిడ్ బిల్డింగు హైద్రాబాదు

ఇచ్చట మంచి భోజనము సకాలమునకు లభించును. మృష్టమైనఫలాహారములు దొరుకును. ప్రయాణీకులకు సౌకర్యములు కలవు. స్టేషనరీ సామానులు మొదలైనవి ఈహోటలు లభించును. కే. యస్. కృష్ణయ్య ప్రొప్రయిటర్

Sree Krishna Bhavan Hotel.

# ప్రకటన

యం. ఆర్. సిద్ధరామయ్య యఫ్. ఆర్ హెచ్.యస్ (లండన్) హార్టికల్చరల్ సర్వేఆఫీసరు మ॥ ఘ॥ నిజాము వ్యయశాఖ హైద్రాబాదు [దక్కను]

౧౯౩౭ జూన్ (అమర్దాదు) హైద్రాబాదులో ఫలముల సర్వేముగిసిన తర్వాత ౧౫ రెసిడెన్సీరోడు, హెడ్ పోలీసుస్టేషన్వద్ద పాయినీరుహార్టికల్చరల్ వ్యాపారమును మరల ప్రారంభించి, తోటపనుల నిమిత్తమై యితరులిచ్చు సలహాలను పొందుచు, ప్రకృతి అలంకారమునకు తగిన తోటల నిర్మించుచు, బాగుగా పరిశీలించి నటువంటి కూరగాయలు, పుష్పముల విత్తనము, మొలకలు మొదలగువాటితో నుండు. క్యాటలాగును నుచితముగ పొందవచ్చును. ౨ ౯ ౧౯౩౭

# గోలకొండ బుక్ డిపో

| గ్రంథము | వెల |
|---|---|
| ౧. రెడ్డికులనిర్ణయచంద్రిక | ౧–౪–౦ |
| ౨. సంఘోద్ధరణము | ౦–౨–౦ |
| ౩. కర్నూలురాజుల వంశావళి | ౦–౨–౦ |
| ౪. గయోపాఖ్యానము | ౦–౬–౦ |
| ౫. కృష్ణాలహరి | ౦–౨–౦ |
| ౬. చారుమినార్ (పద్యములుసచిత్రము) | ౦–౨–౦ |

షరా:— వ్యాపారస్తులకు మంచి కమీషను ఈయబడును. వెంటనేవ్రాసి తెప్పించుకొనుడు.

మేనేజర్ గోలకొండబుక్ డిపో
తూప్రపు బజారు హైదరాబాదు దక్కన్

మలబద్ధకము, నరములు బలసిపోవుట అగ్నిమాంద్యము, నరముల బలహీనత, ముసలివానికి ఆగువానికి ప్రపంచ ప్రసిద్ధి బడసిన మా

# ఆతంక నిగ్రహ మాత్రలు

అద్భుతమగు మందు
50 వండ్లనుండి ప్రసిద్ధి నున్నది.
32 మాత్రల డబ్బి 1-కి 1 రూ
4 రూపాయలకు 5 డబ్బీలు

ఉచితము! ఉచితము!

## కామ శాస్త్రము

ఆరోగ్యమునకు, ఐశ్వర్యమునకు, అభివృద్ధికి చక్కని దారిచూపునది ఉచితముగా పోస్టుకర్చుకూడ లేకుండపంపబడును. కావలసినవారు ఈక్రిందివారికి వ్రాయుడు:—

ఆతంక నిగ్రహ ఫార్మసి
28, బ్రాడ్వే మద్రాసు

